# ఉపోద్ఘాతము

సువార్త పర్యటనమందు నేను కలసికొను విద్వాంసులు, విద్యావిహీనులు, ఘనులు, అల్పులు సహా ఈ యుద్ధ పర్యవసాన మేమైయుండునని నన్నడుగుచుందురు. ఆ యల్పకాలమందు వారికి విపులముగా జబాబు చెప్పుటపడక ప్రవచన నెరవేర్పు అని క్లుప్తముగా ముగించుచుందును. ఇందునుగూర్చి వివరముగా ఒకగ్రంథము వ్రాయమని అనేకులు నన్ను కోరియుండిరి. ప్రభువు ఇప్పటికి ఈ సుదిన మనుగ్రహించి నందుకు స్తోత్రములు.

ఈ చిన్నపొత్తము ప్రవచన నివృత్తి బయలుపరచి, ప్రశ్నించినవారికి యుక్తమగు జవాబు చూపుటయేగాక ప్రవచన ప్రకారము మన స్థానమెచ్చటనున్నది బయలుపరచి ప్రభువు రాకడకు అందరిని సిద్ధపరచునని ఆశించుచున్నాను.

నేను తెలుగుభాష సరిగా నెరుగనప్పటికిని దీనిని ముద్రించుటకు సహాయపడిన బెజవాడ సంఘపెద్దయైన సి ఇ. శామ్యేలుగారికి నావందనము లర్పించుచున్నాను. ప్రభువు మహిమార్థము ఈచిన్న పొత్త ముపకరించునుగాక.

ఇది యుద్ధకాలమందు ముద్రించబడి యుండుటచేత ఆయాచోట్ల యుద్ధపర్యవసాన మనియు లేక ఆయాయుద్ధ నిర్ణాయకుల పేర్లు ఇందు పొందబరచబడి యున్నవి. కాని ప్రస్తుతము దీనిని మరల యథావిధిగా అచ్చొత్తించుటచేత ఆపేర్లు ఆ యుద్ధను సమాచారము అట్లే నిలిచి యున్నదని చదువరులు గ్రహింతురుగాక.

విజయవాడ.
20—11—1957

ఇట్లు,
పాస్టరు పి. యం. సామ్యేలు డి. డి.

# *THE RESURRECTION OF THE ROMAN EMPIRE*

## రోమా సామ్రాజ్య పునరుద్ధారణ.



ప్రపంచమందలి మహానీయ యోచనాధిపతులును, చరిత్రకారులును ప్రస్తుతము లోకము భయంకరస్థితియందున్నదని తెలియజేయుచున్నారు. ఇట్లనుటకు కారణము లోకారంభమునుండి యెన్నడెరుగని విషయములు ప్రస్తుతము గుర్తించుటకై యున్నది. ఈయుగ చక్రము కడువేగముతో మరొక యుగములోనికి ప్రవేశింప త్వరపడుచున్నది ఇందువలన లోకమునకు యేమిసంభవించునాయని చక్రవర్తులు, నియంతలు, ఘనులు మున్నగువారెల్ల భయవిభ్రాంతులకులోనై పైకిమాత్రము భీకరమును ప్రదర్శించుచున్నారు. ప్రపంచ చరిత్ర చదివినయెడల, యెన్నడైనా యుద్ధము జరిగినట్లున్నయెడల, అది ప్రపంచమందు యేమూలలోనో జరిగినట్లు చదువగలరు. గాని పంచఖండములను ఆవరించి తన భారముచేత దానిని నీలుగగొట్ట గలుగుచున్న ప్రస్తుతయుద్ధ గమనమును యెవ్వరైనను యెన్నడైనను కలయందైనా గాంచి యెరుగరు. యిట్టిస్థితి లోకమునకు యేదో దురదృష్టవశాత్తు కలిగినదని చెప్పుటకు యెంతమాత్రమును వీలులేదు. కాని

ఇది తన చిత్తసంకల్పము నెరవేర్చుటకై దేవునియొక్క అంకురార్పణమనుట నిర్వివాదాంశము. దీని సత్యాసత్యము లరయగోరువారు దైవగ్రంథమందలి ప్రవచన భాగము ఒక హస్తమందును ప్రస్తుత లోకస్థితిని తెలియజేయు వార్తాపత్రిక మరియొక హస్తమున నిడుకొని జాగ్రత్తగా పరిశోధించినయెడల ఇవి దేవుని సంకల్పముననే యిట్లు జరుగుచున్నవని తప్పక ఒప్పుకొనగలరు.

1914 నుండి 1918 సం॥ వరకు జరిగిన మహాయుద్ధ ఫలితమును జూచిన అది పాలస్తీనా దేశమును శత్రుహస్తములనుండి రక్తపాతమును లేకయే బ్రిటీషువారు విడిపించి ప్రవచన ప్రకారము దానిని యూదుల హస్తగతమొనర్చుట కైనట్లు గన్పట్టుచున్నది. అయితే ప్రస్తుతము జరుగుచున్న ఈ యుద్ధమునకు ఫలితముగా, ప్రవచన గ్రంథములలో చూపబడినట్లు రోమా సామ్రాజ్యము పునరుద్ధరింపబడునని తేలగలదు. మరియు ఈ విషయమునకు అనుబంధమైన ప్రభు రాకడనుగూర్చి ఆయన తన శిష్యులతో ఈ దిగువ రీతిని వివరించెను.

మీ రాక యెప్పుడని శిష్యు లడిగినప్పుడు ఫలాని సమయమని ప్రభువు జవాబిచ్చెను. లూకా 21:25–27, "భూమిమీద సముద్రతరంగముల ఘోషవలన కలవరపడిన జనములకు శ్రమకలుగును. అప్పుడు మనుష్యకుమారుడు ప్రభావముతోను, మహా మహిమతోను మేఘారూఢుడై వచ్చుట చూతురు."

ప్రశ్న—ఎప్పుడు మనుష్యకుమారుడు వచ్చుట ?

జవాబు—అప్పుడు.

ప్రశ్న—ఎప్పుడు ?

జవాబు—ఎ.భూమిమీద సముద్రతరంగముల ఘోష వచ్చినప్పుడు. బి. జనములకు శ్రమ కలిగినప్పుడు.

అప్పుడు మనుష్యకుమారుడు వచ్చును. ప్రభువైన యేసుక్రీస్తు బోధలన్నియు సాదృశ్యరూపమగు గుప్తములుగా నున్నవి.

"భూమిమీద సముద్రతరంగముల ఘోష" భూమి అనగా అక్షరార్థమగు భూమి. మరియు అందు నివసించు సమస్తజనముకూడ భూమి అను పదములోనే ఇమిడియున్నది.

"సముద్రతరంగములు" అనగా బైబిల్‌లో సముద్రము, నది, జలము మున్నగు ప్రవచనములకు, జనసముదాయమని అర్థము.

యెషయా ప్రవక్త "భక్తిహీనులు కదలుచున్న సముద్రము" అని ప్రవచనపదముతో పిల్చుచున్నాడు. యెష 57:20; 17:12. పరి: యోహాను పత్మసు లంకలోచూచిన దర్శనమందు ఒక స్త్రీ విస్తారజలములమీద కూర్చున్నట్లు చూచెను. ప్రక 17:1 ఆ అధ్యాయమునందే ఈ విస్తార జలములకు భావము, పరిశుద్ధాత్మ దేవుడే వ్యాఖ్యానము చేసెను. ప్రక17:15; "నీవుచూచినజలములు = ప్రజలను జన

సమూహములను, జనములను, ఆ యా భాషలను మాట లాడువారిని సూచించును.''

తరంగములఘోష=సముద్రములో సామాన్యముగాలికి అలలు బయలుదేరుట సహజమే. దానికితోడు తుపాను సమయములో ఆ యలలు మహాభయంకర ప్రళయరూపముదాల్చి మహోర్భాటముతో విజృంభించుట కనుగొందుము. గాలి యును, మరియు తుపానులను ప్రవచన పదముగా యుద్ధమనియు, యుద్ధపువదంతి యను శ్రమ అనియు దానిభావము. ఇర్మియా 25:32, 33; దీనినుండి సముద్రతరంగములఘోష ద్వారా జనములకు శ్రమ అని దానిభావము. ప్రపంచమందలి సమస్తమానవకోటికిని, యుద్ధమును, యుద్ధపువదంతులను బట్టి సమాధానము కోల్పోయి కలవరమునకు గురియగుదు రనునదియే. ఇది కలిగినపుడు మనుష్యకుమారుని ఆగమనము తటస్థించును. ఒక ప్రవచన విద్యార్థి ప్రవచనము అను భూతఅద్దముద్వారా భూలోక మనెడు ఏ ఖండములను పరిశీలించిన అందలి సముద్రమనబడు జనాంగములు, గాలి లేక తుపాను అనబడు యుద్ధము, యుద్ధవదంతులతో అల్లకల్లోలపడుట విశదముగా చూడగలడు. రాజ్యము, రాజ్యమునకును, జాతిజాతికిని, మతము మరియొక మతమునకు విరోధముగా నుండుటయేగాక మత సంబంధముగాను, రాజకీయ సంబంధముగాను సమాధానము లేకయుండుట గ్రహించగలము. సమస్తజనములును శ్రమలలో మునిగియున్నారు.

ఈ సముద్రమను జనసముదాయములో తుపాను అనబడు యుద్ధము బయలుదేరి సమస్తమును తలక్రిందులు

చేయుచు ఇట్టిఘోష కలిగించు హేతువేది? ఒక స్త్రీ గర్భవతియై కాలపరిపూర్ణతానంతరము పిండము గర్భకోశము నుండి వెలువడుటకు ముందు తల్లిగర్భములో కలిగిన కదలిక వలన ఏర్పడిన ప్రసవవేదన అను శ్రమ సమయమున తల్లి ఆర్భటించినట్లు ఈ మహా సముద్రగర్భములో ఉన్న ఒక వ్యక్తి తనకాలము సంపూర్ణమగుటచే బయట వచ్చుటకు ప్రయత్నించుటవలన కలిగిన ఆర్భాటముగా నీ ప్రళయము గోచరించకపోదు. ఈ మహాసముద్ర మనబడు జనసమూహాయములో ఉన్న ఈ వ్యక్తి యెవరు? పరి: యోహాను పత్మాసులంకలో పరవాసియై ఉన్నప్పుడు ఆయన ఆత్మవశుడై సముద్రపుటొడ్డున ఉండగా ఆ మహా సముద్రమునుండి ఒక మహా క్రూరమృగము ఏడుతలలు పదికొమ్ములతో వచ్చుట చూచెను. ప్రకటన 13:1-10.



ఈ క్రూరమృగమే లోకమునకు ప్రధానము చేయబడవలసిన రాజ్యము మరియు అంత్య క్రీస్తుని ఉన్నది. ఆ రాజ్యము బయటకు వచ్చునప్పుడు మనుష్యకుమారుడు మేఘారూఢుడై వచ్చును. ఈ రాజ్య (క్రూరమృగ) మేది? దీని భావము పరిశుద్ధగ్రంథమే తెలుపుచున్నది. ప్రక 17:8 "నీవు చూచిన ఆ మృగముండెనుగాని ఇప్పుడు లేదు. అయితే అది పాతాళములోనుండి పైకి వచ్చుటకును, నాశనమునకు పోవుటకును సిద్ధముగానున్నది." ఈ వచనములో ఈ మృగమునకు ముఖ్యమగు నాలుగు విశేషములు పరిశుద్ధాత్మ చూపించుచున్నాడు.

1. "ఉండెను" అనగా పరి: యోహాను కాలమునకు ముందు ఒకప్పుడు ఆ మృగము ఈ లోకములో ఉండెను.

2. "ఇప్పుడులేదు" - అనగా పరి: యోహాను ఈ దర్శనకాలములో అది భూలోకములోలేదు. (సముద్రములో మునిగిపోయెను )

3. "పాతాళములోనుండి పైకివచ్చును" = భవిష్యత్కాలములో సముద్రమునుండి పైకివచ్చును.

4. "నాశనమునకు పోవును"=బయటకువచ్చిన అల్ప కాలమునకే నాశనమగును. ముందున్న ఈ మృగము ప్రవచన ప్రవీణునకు క్రొత్తమృగముకాదు. పరి: యోహాను ఈదర్శనముచూచిన 656 సం॥లకు ముందు ఈ మృగము పరిశుద్ధ గ్రంథమందున్నది. పాత నిబంధన ప్రవక్తలలో ప్రాముఖ్యుడైన దానియేలు చూచిన మృగము ఇదే.

B. C. 558 సం॥లో దానియేలుకు రాత్రి దర్శనము కలిగినది. ఆకాశపు నలుదిక్కులనుండి సముద్రముమీద గాలి విసరుట నాకు కనబడెను. అప్పుడు నాలుగు మిక్కిలి గొప్ప జంతువులు మహా సముద్రములోనుండి పైకెక్కెను. దానియేలు 7:2 గాలి అను మాటకు యుద్ధము, యుద్ధపు వదంతులుగా ముందు తెలిపియుంటిని. ఈ యుద్ధము దాని వదంతి సముద్రము (జనసముదాయము) మీద విసరెను. అనగా లోకమంతటను యుద్ధభయము ప్రబలియున్నది. ఇదియేగదా ప్రస్తుతము మన మనుభవించునది. ఆ మనుష్య సముదాయము (మహా సముద్రము) నుండి నాలుగుమృగములు ఒకదానితరువాత మరియొకటి బయటకు వచ్చెను.



1. సింహము:- 7:4 బాబెలు సామ్రాజ్యము, దానియేలు 2:38. B.C. 606 నుండి 538 వరకు.



2. ఎలుగుబంటి-:
7 : 5 మాదియ,
పారసీకుల సామ్రా
జ్యము, దాని
యేలు8:20.B.C.
538 నుండి 330
వరకు.



3. చిరుతపులి:-
7:6 గ్రీకుల సామ్రా
జ్యము, దానియేలు
8:21 B. C. 330 నుండి
30 వరకు



4. ఘోరమును
భయంకరము నగు
మృగము:-

7:7 & 8 రోమా
సామ్రాజ్యము, దాని
యేలు 9:26. B. C.
30 నుండిA. D. 364
వరకు.

వీ రెవ్వరు ? దానియేలు 7:17. రాబోవుచున్న నాలుగురాజ్యములును, నలుగురు రాజులును అయినట్లు వ్రాయబడియున్నది.

దానియేలు చూచిన దర్శనములో భిన్నములైన నాలుగుమృగములు ఉన్నవి. గాని పరి: యోహాను చూచి నప్పుడు భిన్నవిభాగములతో నిర్మితమైన ఒక మృగము కనబడుచున్నది.

| దానియేలు 7 అ | ప్రకటన 13 అ |
|---|---|
| దానియేలు దర్శనము | పరిశుద్ధ యోహాను దర్శనము |
| సింహము | ముఖము, సింహము |
| ఎలుగుబంటి | పాదములు, ఎలుగుబంటి |
| చిరుతపులి | శరీరము, చిరుతపులి |

భయంకరమృగము – పరిపూర్ణత 10 కొమ్ములుగలమృగము

ఈ రెండు దర్శనములలోకూడ మృగము మహాసము ద్రమునుండి బయటకు వచ్చుట స్పష్టమగుచున్నది. పరి: యోహాను చూచిన ఈ మృగము ముందొకప్పుడుండెను. B C. 606 నుండి A. D. 334 వరకు. అంతములో 10 కొమ్ములుగల క్రూరమృగము వచ్చెను. అది రోమాసామ్రా జ్యమే. అది ఇప్పుడులేదు, అనగా పరి. యోహాను కాల ములో "ఆ మృగము ఇప్పుడులేదు." అని వ్రాసెను. కాని

రోమా పరిపాలన A. D. 364 వరకు ఉన్నట్లు ఉన్నది. దీనిని బట్టి పాఠకులు రోమారాజ్యముగా భావించక రోమా సామ్రాజ్య ఔన్నత్యదశ అని గ్రహింతురుగాక. పరి. యోహాను కాలమునకు ఈ సామ్రాజ్యము క్షీణించుటచేతనే అట్లు వ్రాసెను. రోమారాజ్యము అప్పటినుండి ఇప్పటివరకుండుట అంద రెరిగినదే. గాని A. D. 364 సం॥ జనవరి17వ తారీఖు రోమా చక్రవర్తియైన జూబియన్, చనిపోయెను, అప్పుడు ఈ సామ్రాజ్యము పాశ్చాత్య రోమారాజ్య మనియు పౌరస్థ్య రోమారాజ్యమనియు రెండుగా భాగించబడెను. దానియేలు చూచిన ఈ దర్శనమునకు 48 సం॥ ముందు బాబెలు రాజైన నెబుకద్నెజరుకు వచ్చిన కలలోనున్న ప్రతిమ నాలుగు భాగములుగా నుండెను. దానియేలు 2:31 నుండి శిరస్సు మేలిమి బంగారము ఈ శిరస్సే బాబెలు సామ్రాజ్యము. దాని రొమ్మును బుజములును వెండివి. ఇది మాదియ పారసీక రాజ్యము దాని ఉదరము తొడలును ఇత్తడివి. ఇది గ్రీకు రాజ్యము. దాని మోకాళ్ళు ఇనుపవియు దాని పాదములలో ఒకభాగము ఇనుపదియు ఒక్క భాగము మట్టిదియునై యుండెను ఇదియే రోమా సామ్రాజ్యము ఈ ప్రతిమకు రెండుగా ఉన్న కాళ్ళరీతిగా రోమా రాజ్యము రెండుగా అనగా ప్రాశ్చాత్య రోమారాజ్యమనియు పౌరస్థ్యరోమారాజ్యమనియువిభాగింపబడెను ఒక్కొక్క పాదమునకుఐదువేళ్ళు ఉన్నరీతిగా ఈ ప్రతిరాజ్యమునకును ఐదు చిన్న దేశములుచేరి ఒక రాజ్యముగా ఏర్పరచబడెను. ఈ విధముగారోమాసామ్రాజ్యమనబడు ఈ మృగము శిథిలమై మహా

సముద్రమనబడు జనములలో నెన్నికలేనిదై, మునిగిన రీతిని చూపబడెను. మన కాలములో అఖిలాండ రోమాసామ్రాజ్య మనబడునది లేదు. ఆ మృగము మహాసముద్రగర్భమునుండి త్వరగా బయటికి వచ్చుటకు ప్రయత్నించుచున్నందున కలిగిన ఘోరదినములే యివి హిట్లరు, ముసోలినీ, స్టాలిన్, ఫ్రాంకో, మార్షల్ పేటెన్, చెర్చిల్ మొదలైన రాజ్యాంగ నాయకులు చేయుచున్న యుద్ధప్రయత్న మనునవియే మహాసముద్ర తరంగములు. జనసముదాయమును, కదలించి శ్రమలు కలిగించి ఆ మృగమును బయటకు తీసికొని వచ్చునవై యున్నవి. ఇది చూచినప్పుడు మనుష్యకుమారుని రాకడ సమీపములో నున్నదని నిశ్చయము కాగలదు.

ఆ మృగము సముద్రమునుండి వచ్చినప్పుడు దానికి 10 కొమ్ములుండవలెను. దానియేలు 7:7, ప్రకటన 17:1-3. ఆ పది కొమ్ములు 10 రాజ్యములు లేక 10 రాజులుగా వివరింపబడెను. దానియేలు 7:24, ప్రకటన 17:12 మహా సముద్రములో మునిగిపోయిన (పాతిపెట్టబడిన రోమారాజ్యము) మరల పునర్జీవముపొంది సముద్రమను సమాధినుండి బయటకు వచ్చి అఖిలాండ పరిపాలనచేయవలెను. పురాతన రోమారాజ్యము A. D. 364 లో రెండుగా భాగించిన తరువాత అది పది చిన్నరాజ్యములుగా మారెను. అవి యేవి?

| పడమటి రోమా రాజ్యము | తూర్పు రోమా రాజ్యము |
|---|---|
| 1. బ్రిటన్ | 6. గ్రీస్ |
| 2. ఫ్రాంసు | 7. టర్కీ |
| 3. స్పెయిన్ | 8. బల్గేరియా |
| 4. ఇటలీ | 9. సిరియా |
| 5. ఆస్ట్రియా | 10. ఈజిప్టు |

మరల ఈ మృగము పునర్జీవనము పొంది, ఈ పది రాజ్యములతో రావలెను. ఆ నియమ నెరవేర్పునకే ప్రస్తుత మీ యుద్ధము మార్గము సిద్ధము చేయుచున్నది. ఇందు గ్రహింపవలసిన ముఖ్యవిషయము ఒకటి కలదు. ప్రస్తుత యుద్ధములో జర్మనీ నియంతయగు హిట్లరు కుక్క మొరిగిన రీతి లోకభయంకరుడుగా నున్నను ప్రవచన ప్రకారము కొలది దినములలో యెన్నిక లేనివాడగును. కారణము పురాతనరోమా రాజ్యములో జర్మనీ రాజ్యములేదు. మరియు ఆరాజ్యము ఇటలీతోగాని లేక రష్యాతోగాని లీనము కావల సినదే. ప్రస్తుత యుద్ధచరిత్ర గమనించినయెడల యుద్ధ పర్యవసానము తేలవలసిన స్థానము ఇటు బ్రిటనో అటు జర్మ నీయో కావలెను. అదివిడిచి పెడమార్గముపట్టి క్రమేణ పరి శుద్ధ భూమియగు పాలస్తీనాకు దారితీయుచున్నది. ఈ యుద్ధము అంత్యయుద్ధముకాదు. కాని 10 ఐక్యరాజ్యముల (Ten Federated Kingdoms) లతో కూడిన రోమాసామ్రా జ్యము పునర్జీవన మిచ్చుటకే, ఆరోమాసామ్రాజ్యమునకు

అంత్య క్రీస్తు అను అబద్ధ మెస్సీయా ప్రెసిడెంటుగానుండి సర్వ లోకమును యేలును. ఆ సమయములోనే నితడు యూదు లతో నిబంధన చేసికొని ఒకవారము (7 సం॥ లు) వరకు పరిపాలించును. గాని యీ పరిపాలనకు ముందుగా యేసు క్రీస్తుకు పెండ్లికుమార్తెయైన సంఘము మధ్యాకాశమునకు యెత్తబడును.

ఈ 7 సం॥ లకు మహాశ్రమకాల మని పేరు. ఈ 7 సం వత్సరముల పరిపాలనాంతమందు 10 ఐక్యరాజ్యముల సైన్యము లన్నియు కలసి యెరూషలేముకు ఉత్తరముగాయున్న "మెగిద్దోనను" లోయలోకూడి యెరూషలేముపై దండెత్తును. ఈ యుద్ధనాయకుడైన అంత్య క్రీస్తుకు ప్రధాన సహాయకు డుగా గోగు, మాగోగను. రష్యా ప్రాధాన్యము వహించును. యెహె. 38 అ. 39 అ. జకర్యా 14:2 అప్పుడు యూదులు గొప్ప విలాపములు చేయుదురు. జకర్యా. 12 : 10.

ఈ యూదుల విలాపములు పరలోక సేనాధిపతియగు యేసుక్రీస్తు విని వారిని రక్షించుటకు తన పరలోక సేనా సమేతుడై ఒలీవకొండపై దిగును. ప్రకట.19:11-16.

అప్పుడు యూదులు ఆయనను (యేసుక్రీస్తును) కన్నులార చూతురు జకర్యా. 14:4.

మహామృగము, అంతిమ క్రీస్తు తన 10 ఐక్యరాజ్య ములు వారి సేనలును కలసి యేసుక్రీస్తుకు విరోధముగా యుద్ధము చేయుదురు. అప్పుడు తెల్లని గుఱ్ఱముమీద నాసీను

డైన రాజులకు రాజైన యేసుక్రీస్తు నోటనుండి వచ్చిన ఖడ్గముచేత వారు వధింపబడుదురు. ఈ యుద్ధముకే అర్మగెదోనని పేరు ప్రకట 16:15 అప్పుడు మృగము అబద్ధ ప్రవక్త అను వీరిద్దరు పట్టబడి గంధకముతో మండుచున్న అగ్నిగుండములో పడద్రోయబడుదురు. ప్రకట 19:17 21. మరియు ఆదిసర్పము, అపవాది, సాతాను అను ఆ మహా ఘటసర్పమును దేవ దూతలు పట్టుకొని వెయ్యి సం॥లు పాతాళములో బంధింతురు. ప్ర 20:1–3 ఈలాగు పునర్జీవము పొందిన రోమాసామ్రాజ్యము నాశన మగును. ప్రక 17:8. అప్పుడు ప్రభువైన యేసుక్రీస్తు తన నీతి, సమాధానములు కలిగిన దేవుని రాజ్యము స్థాపించి రాజులందరికి రాజుగా ఈ లోకమును పాలించును. ఈ పాలనకాలముకే 1000 సం॥ పరిపాలన కాలమనబడును.

ప్రియ చదువరులారా! ఇవన్నియు మనము చూచి నప్పుడు మనుష్య కుమారుడు వచ్చునని నిశ్చయించుకొన వలెను. ప్రవచన నిర్ణయము పూర్తియగుచున్నది. ప్రభువు రాకడ చాల సమీపములోనున్నది. సిద్ధపడుము.



బాలప్రభా ప్రెస్, మాచవరం, విజయవాడ–2.

1. ఈ ప్రవచనములు చీకటిలో ప్రకాశించుచున్న దీపముగానున్నదని అపొస్తలుడైన పేతురు వ్రాసెను.

తెల్లవారి వేకువచుక్క యుదయించు పర్యంతము చీకటికాలములో ప్రకాశించే వెలుగుగా మీహృదయములో ప్రవచనమును లక్ష్యముంచవలయును.

2. ఆత్మను ఆర్పకుడి. ప్రవచింపుటను నిర్లక్ష్యము చేయకుడి. 1 థెస్సలొ. 5: 19, 20.

3 ఇవి జరుగ నారంభించినప్పుడు మీరు ధైర్యము తెచ్చుకొని మీతల లెత్తికొనుడి, మీ విమోచన సమీపించుచున్నదనెను. లూక. 21: 28.

# సువార్తా ప్రకాశిని ఆఫీసులో దొరకు గ్రంథములు.



1. "సువార్తాప్రకాశిని:— ఇది మాసపత్రిక. ఈ కడవరి కాలములో, క్రీస్తురాకడ విషయమై ప్రవచన నెరవేర్పులను పరిశుద్ధాత్మాభిషేకముయొక్క అవసరతనువిశదీకరించు నవీన పత్రిక.
సంవత్సర చందా రు 1—౧—0 మాత్రమే.

2. ప్రత్యక్షపు గుడారము:—క్రొత్తనిబంధనలో యేసు ప్రభువునకు ఆయన సభ్యసంఘమునకును సాదృశ్యముగా పాత నిబంధనలో; మోషేవలన నిర్మింపబడిన ప్రత్యక్షపు గుడారము దాని లోని ఉపకరణములు మొదలగు వానినిగూర్చి, పటములతో గ్లేజు కాగితముమీద 100 పేజీలు. వెల 0—60 NP మాత్రమే.

3. జీవజలము:- ప్రాతనిబంధనలోని పాదుకలను ఆధార పరచుకొని, నూతన నిబంధనలోనున్న పరిశుద్ధాత్మాభిషేకమును వివరించు ఒక చిన్న పుస్తకము. వెల 0—20 NP మాత్రమే.

4. పరిశుద్ధాత్మాభిషేకము:— గ్రంథకర్త పుస్తకములోని ప్రతి అంశమును, దాని ప్రశ్నలకు జవాబులున్నూ తేటగా వివరించెను. ప్రతి తెలుగు క్రైస్తవునికి అవసరమైన పుస్తకము. వెల 0—45 NP

5 ప్రవచన ప్రకాశిని:- వెల రు. 1-0-౧

6. హితోపదేశ సంక్షేపము:- వెల 0—12 NP

7. ప్రకటనగ్రంథము:- వెల 60 న. పై.

"సువార్తాప్రకాశిని" ఆఫీసు, బెజవాడ. | పాస్టరు పి. యం. సామ్యేలు. డి.డి.